యాదాయము 192.90 కోట్ల వ్యయము. రాగలసంవత్సరమునందు 106.93 కోట్ల యాదాయము, 104.57 వ్యయము సామ్రాజ్యాదాయవ్యయములుగ మదింపు వేయబడినది. గత సంవత్సరము సైన్య వ్యయమునకు 65 కోట్లు మదింపు వేయబడినను 62 కోట్లు మాత్రమె వ్యయమైనది. రాగల సంవత్సరమునకు 60 కోట్ల సైనిక వ్యయము మదింపు వేయబడినది. బ్లాకెటు గారి ఇంద్రజాలమంతయును సైన్యవ్యయము లెక్కలయందు గనుపడుచున్నది. రాగల సంవత్సరపు 107 కోట్ల యాదాయమునుండియును 63 కోట్ల సైన్యవ్యయమునకు వినియోగపడనున్నవి. ఈ యంకెలు చెప్పక చెప్పుచున్న విషయమువిూదను వ్యాఖ్యానమనవసరము. పాశ్చాత్యసభ్యత్వము ప్రపంచమునకు ప్రసాదించిన నవసరములందాసుర సంపద్భాగ్యము ప్రధానముగ నున్నది. ఈ యాసురప్రసాదము సుందోపసుందవరముగ నాత్మవినాశనమునకు దోడ్పడుచున్న విధమును యూరపురాజ్యములచరిత్రము తెలియ జేయుచున్నను ఆ రాజ్యములందు జ్ఞానోదయము గలుగలేదు. పాశ్చాత్యరాజ్యాధిపత్యము క్రిందను క్రుంగుచున్న భరతఖండమునకును నీదుర్దశ గలిగినది. భారతప్రభుత్వమున కగుచున్న యపారమైనసైన్యవ్యయమును నాసురబలాదాధనఫలమునె విశదము చేయుచున్నది. భారతప్రభుత్వము నిరీక్షణమును మార్చనంతవరకును ఉప్పుపన్నును తగ్గించినను ఇతరపన్నులను తగ్గించినను దేశమునకు శాంతిసుఖములు గలుగజాలవు. గాంధిమహాత్ముడీదృష్టి మారుటకె అసహాయోద్యమయోగమును అహింసాతత్త్వమును బోధించెను. రెండేండ్ల కారాగృహవాసానంతరమైనను ప్రభుత్వ నిరీక్షణము మారలేదని గాంధిమహాత్ముడు కనుగొనెను. జెయిటో ప్రాంతమునందు సంభవించిన అకాలీమరణములు జలియన్వాలాబాగుహత్యలను సంస్మరింప జేయుచున్నవి. జలియన్వాలా బాగు హత్యలకువలె జెయిటో హత్యలకును ప్రతీకారము లేదు. ఈదుర్దశయందు సహకార మసంభవమని తెలియుచున్నను ప్రాత మార్గమునె యవలంబించుట దేశమోక్షణమునకు ప్రయోజనకరముగాదు. ఆలివియరు రెడింగు హెయిలి బ్లాకెటుగారు లీపాటను పాడుటయందు విచిత్రము లేదు. దుఃఖానుభవము గల భారతనాయకు లీమార్గము నవలంబించుట విచిత్రముగనున్నది. ఇప్పుడైనను నాయకులు ప్రజలు గాంధిమహాత్ముని యాదేశముల నారాధించి దుఃఖనాశనమునకు సాధనమైన స్వరాజ్యవిజయమును బడయుటకు బ్రయత్నించుదురుగాక!

---

# గయ్యాళి యిల్లాలు

కో. నరసింహాచారిగారు

శ్లో. అనేక శతభాండాని భిన్నాని మమ మస్తకే,
అహో! గుణవతీ భార్యా భాండమూలం న యాచతే.



పాట:—

బుంగంటె బుంగకాదురా, బాపడా! బుంగ కరీ దివ్వరా॥
బుంగ కరీ దిచ్చి పోకుంటె నిన్నొక్క, అంగైన సాగనివ్వరా! బాపడా!
బుంగ కరీ దివ్వరా॥ బుంగంటె॥

రంగులమారి బుంగ, రాయివంటి గట్టి బుంగ
శృంగారమైన బుంగ, చేతి కింపైన బుంగ॥ బుంగంటె॥
బుంగ బుజాన బెట్టి పుక్కిట తమ్మ బెట్టి
ఠింగురింగు మని పోతే ఖంగుఖంగు మనునట్టి॥ బుంగంటె॥

Edited and Published by K. NAGESWARA RAO, at the Andhra Patrika Press, No. 7. Thumbu Chetty Street, G. T. Madras.

9-4-24

# విషయానుక్రమణిక

## చిత్రపటముల వివరము

రంగులపటములు— కృష్ణదేవరాయలు - అల్లసాని పెద్దన కవి, చిత్రకారుడు:—యస్. కే. వి. గోపాల్‌గారు; పశ్చిమకనమలు - జలపాతము, చిత్రకారుడు: దా. రామారావుగారు, * మౌలానా ఆలి - ఉత్తర కీర్ణము 1, రాయగిరి కీర్ణము 1.

ఇతరపటములు—స్వామివివేకానంద, మధుకలశము, శ్రీశైలమునందలి శిల్పచిత్రములు, ఇతరచిత్రములును.

☞ పుట 92 "కృతార్థుడు" ఈపద్యము రెండవపాదములో 'సంతాన మిత్రబాంధవసమృద్ధి' అనుటకు మఱుగా 'సంతానహిత బంధుజన సమృద్ధి' అని చదువుకొనునది.

---

* ఈచిత్రము భారతి 3-వ సంచిక ఆర్ష విచారమునకు సంబంధించినది.

